# మళ్లీ



ఆదర్శగ్రంథమండలి ఆగిపోయిం దనుకున్నా రంతా. నేనూ అంతే అనుకున్నా. నాలుగు సంవత్సరాలైంది ప్రచురణ ఆపివేసి. కాని నేటికి మళ్ళీ ఉత్సాహం ముందుకు తోస్తూవుంటే గ్రంథప్రచురణకు పూనుకున్నా. చాలాకాలాన్నుంచి మండలి పని కట్టడివుండడంవల్ల ఈమధ్య పేరుమార్చి యుగవాణిని తల పెట్టాను. సోదరు లనేకమంది బాగానే ప్రోత్సాహమిచ్చారు. కాని ఆదర్శగ్రంథమండలి శ్రేయోభిలాషులు, అదిచేసిన సేవను మరువని హితులు చాలామంది పేరుమార్చడం బాగా లేదనీ, కొంతకాలం ప్రచురణక్రమం కుంటుపడినంతమాత్రాన పేరుమార్చితే మండలి ఆదర్శం పాఠకులు గుర్తించడానికి చాలా శ్రమపడవలసివుంటుందనీ ఖచ్చితమైన సలహాలిచ్చారు.

మిత్రుల సలహా ననుసరించి ఆదర్శగ్రంథమండలి పేరు తోనే పుస్తకాలు ప్రకటించదలచాను. కాబట్టి గ్రాహకులు యథారీతిని తోడ్పడెదరని విశ్వసించుచున్నాను.



# ప రి చ య ము



ఎమిల్ లడ్విగ్ అనే జర్మను ప్రఖ్యాతప్రముఖుడు సోవియట్ రష్యా నియంత జోసెఫ్‌స్టాలిన్‌ను సందర్శించాడు 1931 సంవత్సరాంతంలో. ఆ సందర్భంలో వారిద్దరికీ జరిగిన సంభాషణ చాలా ప్రాముఖ్యమైనది.

లడ్విగ్ మహాశయు డనేక గొప్పగ్రంథములను రచించాడు. అవన్నీ నాజీ జర్మనీ భోగిమంటల కాహుతిఅయినై. స్టాలిన్‌తో మాట్లాడేటప్పుడు ఈమహారచయిత అనేక ప్రాముఖ్యమైన ప్రశ్నలు వేశాడు. ఉక్కుమనిషి అయిన స్టాలిన్ వాటన్నిటికీ స్పష్టమైన సమాధానా లిచ్చి లడ్విగ్‌కు పూర్తిగ సంతృప్తి కలిగించాడు.

చూడండి. స్టాలిన్ మామ 'సర్వసమానత్వాన్ని'గూర్చి ఇచ్చిన సమాధాన మెంత స్పష్టంగా వుందో. నిర్మాణపూర్వక ఆర్థికవ్యవస్థనుగూర్చి కొంతమంది విజ్ఞులు విపరీతానుమానములను కల్పించుకొని, సోషలిజం సాధ్యం కాదంటారు. అట్టి అనుమానా ల్ని ఈ సమాధానం తుత్తునియలుచేసివేస్తుంది నిస్సంశయంగా.

“ఉత్పత్తి సాధనములు మొదలగువాటిని యజమానులనుంచి వూడబెరకడమనే దానిని, సోషలిష్టు ఆర్థికవ్యవస్థలో కూలీ లెక్కువ వుత్పత్తిచేసి, వాళ్ళ జీవితపరిమాణమును అభివృద్ధి చేసుకుంటారు అనేదానితో మిశ్రిమముచేసి, సోషలిష్టులు భాగ్యవంతుల సొమ్మును గణనిధికిరింద కాజేసి సమానంగా వంచిపెట్టమంటారు, అని వాళ్ళు చెపుతారు. ఇది కేవలం దురభిప్రాయం. వికృతరూపం చేసి అపార్థాలు లాగడం భూర్జువాల పని.”

అనుభవజ్ఞుడగు స్టాలిన్ సమాధానాలుగల ఈ చిన్నిపుస్తకం ఆంధ్రులకు— ముఖ్యంగా మార్క్సిస్టులకు బాగా వుపయోగపడుతుం దనే ఆశతోనే ప్రకటించుతున్నాం.

గద్దె లింగయ్య
సంపాదకుడు



# స్టాలిన్ - లడ్విగ్గుల సంభాషణ

ఎమిల్ లడ్విగ్ : మిమ్మల్ని సందర్శించడానికి అనుమతి యిచ్చినందుకు కృతజ్ఞుడను. ఇరవై సంవత్సరాలనుంచీ చారిత్రికంగా ప్రముఖులైనవారి జీవితాన్ని, ఘనకార్యాలను గురించీ చదువుతున్నాను. నేను ప్రజలను చక్కగా గ్రహించగలననే నమ్మకము వుంది; కాని ఆర్థిక పరిస్థితులను గురించి బొత్తిగా తెలియదు.

జోసెఫ్ స్టాలిన్ : మీరు గర్వంలేని వారండీ!

లడ్విగ్ : అవును. నిజంకూడా అంతే. అందుచేత నే నడిగే ప్రశ్నలు మీకు విపరీతంగా తోస్తై. ఈరోజున యిక్కడ పీటర్ ది గ్రేట్ (పూర్వ సార్వభౌముడు) శిథిలాలు కొన్ని చూచాను. నేను మిమ్మడుగబోయే మొదటి ప్రశ్న వేస్తాను. పీటరు చక్రవర్తికీ మీకూ సాదృశ్యం ఏమన్నా వుందని మీ రనుకుంటున్నారా? పీటరు ఆశయములనే మీరు సాగించు తున్నా రని అనుకుంటున్నారా?

స్టాలిన్ : ఎంతమాత్రం అనుకోను. చారిత్రికోపమానాలు ఎప్పుడూ ప్రమాదకరమే—మీ యీ ప్రశ్నలోని సాదృశ్యం అసంబద్ధము.

లడ్విగ్ : స్వదేశాభివృద్ధికీ, రష్యాకు పాశ్చాత్య నాగరికతను దిగుమతి చేయడానికీ పీటరు బాగా కృషిచేశాడు.

స్టాలిన్ : అవును. నిజమే. భూస్వామ్యవర్గాన్నీ, అభివృద్ధిమార్గంలో అగ్రిసర మవుతున్న వ్యాపారవర్గాన్నీ వున్నత శిఖర మెక్కించేందుకూ, ఆ వర్గాల జాతీయ ప్రభుత్వాన్ని సృష్టించడానికీ పీటరు చాలా ప్రయత్నంచేశాడు. భూస్వామ్యవర్గము అభివృద్ధికి రావడమూ, వున్నతిచెందుచున్న వ్యాపార వర్గం బలపరచ బడడమూ, జాతీయ ప్రభుత్వము స్థాపించబడడమూ రైతుల—బానిసల రక్తం పీడించడంవల్లనే అని కూడా చెప్పాలి. ఇక నావిషయమో నేను లెనినుకు శిష్యుడను మాత్రమే. ఆయనకు తగిన శిష్యుణ్ణి కావాలనే నే నెప్పుడూ చూస్తుంటాను. కార్మికవర్గాన్ని పైకిలేవతీయడానికే నాజీవితాన్ని అంకితంచేశా. ఏ జాతీయప్రభుత్వాన్ని బలవరచడముకూడా నాపని కాదు. సోషలిష్టు సమాజాన్ని బలవత్తర మొనర్చడమే నా విధి. అది అంతర్జాతీయ రాజ్యము. అట్టి రాజ్యాన్ని బలపరచే ప్రతిశక్తి అంతర్జాతీయ కార్మికవర్గాన్ని బలపరుస్తుంది. కార్మికవర్గాన్ని వున్నతి చెందించుటకూ, సోషలిష్టురాజ్యాన్ని బలపరచుటకూ నేనుచేసే ప్రతిచిన్నపనీ కార్మిక వర్గాన్ని బలపరచుటకూ—అభివృద్ధిచెందించుటకూ కాకపోతే నాజీవితం నిరర్థకము. అందువల్ల మీపోలిక సరిగాదని గ్రహించి వుంటారు.

లెనిన్, పీటరు ది గ్రేటుల విషయంలో లెనిన్ ఒక మహాసముద్రము. పీటరు ఆ సముద్రంలో ఒక నీటిబొట్టు మాత్రమే.

లుడ్విగ్ : చరిత్రలో వ్యక్తులు ప్రాధాన్యత వహిస్తారనే విషయాన్ని మార్క్సిజము ఒప్పుకోదుగదా! మరి చారిత్రిక భౌతికవాదమునకూ — చరిత్రలో వ్యక్తులు ప్రముఖ పాత్రలు వహిస్తారని మీరిప్పుడే అంగీకరించినదానికీ పరస్పరభేదం వున్నట్లు మీకు కన్పించడం లేదా?

స్టాలిన్ : లేదు. భేదం ఎంతమాత్రం లేదు. ప్రముఖులు చరిత్రలో ప్రధానభూమిక వహిస్తారనే విషయాన్ని మార్క్సిజ మెప్పుడూ కాదనదు. అంతే కాదు. ప్రజలు, చరిత్రకారులు కాదనికూడా అనదు. "పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ" అనే మార్క్సు పుస్తకంలో ప్రజలే చరిత్రకు సృష్టికర్తలని విశదపడుతుంది. అయితే ప్రజలు తమ ఇష్టంవచ్చినట్టుగాని వూహా ప్రేరణల వల్లగాని చరిత్రను సృష్టించరు. ప్రతి క్రొత్త తరంవాళ్లూ అంతకు ముందు సిద్ధమై అమల్లోవున్న ఆచారాలను ఎదుర్కొంటారు. వాటిని సరిగా అర్థంచేసుకుని మార్చడం ఎలాగో తెలుసుకున్నంతవరకే మహాపురుషుల విలువా — సమర్థతాను. ఆ పరిస్థితులను సరిగా అర్థం చేసుకోలేక వాటిని తమ చిత్తం వచ్చినట్లు మార్చ ప్రయత్నిస్తే వాళ్ళే వొక విపరీతావస్థలో చిక్కుపడతారు. కాబట్టి మార్క్సు చెప్పినట్లు 'ప్రజలు పరిస్థితులకు వ్యతిరేకించి పోగూడదు' అని మీకు తెలిసివుంటుంది. ప్రజలు చరిత్రకారులే; కాని, అంతకుపూర్వమున్న ఆచార వ్యవహారములను సరిగా అర్థంచేసుకుని, వాటిని మార్చడం, వాటిని తమ కనుకూలంగా వుపయోగించుకోవడం తెలిసినంత వరకే వారు చరిత్రకారులు. చివరకు మార్క్సును మా రష్

యన్ బోల్షివిక్కులు అర్థంచేసుకునే విధంకూడా అదే. మేము అనేక సంవత్సరాలనుంచీ మార్క్సు పుస్తకాలు చదువు తున్నాము.

లడ్విగ్ : ముప్పై సంవత్సరాలనాడు నేను విశ్వవిద్యాలయ విద్యార్థినై వున్నప్పుడు చారిత్రిక భౌతిక వాదాన్ని విశ్వసిస్తున్నా మనుకునే ప్రొఫెసర్లనేకమంది మార్క్సిజము వీరుల ప్రాధాన్యతను, చరిత్రిలో మహాపురుషుల ప్రధాన పాత్రిలను ఒప్పుకోదని బోధించారే!

స్టాలిన్ : వాళ్లంతా మార్క్సిజాన్ని క్షుద్రిం చేస్తు న్నారు. వీరుల పాత్రిలను మార్క్సిజ మెప్పుడూ కాదనలేదు. నేను ఇంతకుముందు వివరించిన నిబంధనలకు కట్టుబడి వాళ్ళు చరిత్రిలో అత్యల్పమగు పాత్రిను ధరిస్తా రని ఒప్పుకుంటుంది కూడా.

లడ్విగ్ : మనం కూర్చున్న మేజా చుట్టూ 16 కుర్చీ లున్నై. ఒకవైపున ప్రతివిషయాన్నీ సహచరసంఘాలు నిర్ణయిస్తాయనీ, మరోవంక ప్రతివిషయాన్నీ వ్యక్తులు నిర్ణయిస్తా రనీ ఇతరదేశాలు అనుకుంటూవున్నై. ఇందులో నిజంగా నిర్ణయించే దెవరు?

స్టాలిన్ : అవును, ప్రత్యేకవ్యక్తులు నిర్ణయించలేరు. ఒక వ్యక్తిచేసే నిర్ణయా లెప్పుడూ సాధారణంగా పాక్షికరూపందాల్చి వుంటాయి. మా ప్రతినహచరసంఘంలోనూ, ప్రతిసంయుక్తసంఘం లోనూ గణింపతగ్గ అభిప్రాయాలుగల వ్యక్తు లుంటారు. ఆయా

సంఘాల్లో తప్పుడు సలహాలిచ్చే వ్యక్తులుకూడా వుండవచ్చును. మూడువిప్లవాల అనుభవంవల్ల ప్రత్యేకవ్యక్తుల నిర్ణయాలు—— సరిగా పరీక్షింపబడి, సంయుక్తముగా సరిచేయబడక పోవడంవల్ల— నూటికి తొంభై పాక్షికంగా తేలినవని మాకు తెలును. మాసోవియటు, కమ్యూనిష్టు పక్షములను నడిపించే కార్యనిర్వాహక సంఘంలో, నాయకవర్గంలో షుమారు 70 మంది సభ్యులున్నారు. కేంద్రసంఘంలోని ఈ 70 మందిలో కార్మికులలోని ప్రముఖులు, వినిమయ నిర్వాహకులలో ముఖ్యులు, మాసైనికులలో ప్రధానులు, మా ప్రచారకులలో—ఆందోళకులలో ప్రముఖులు, మాసోవియటు సాముదాయక వ్యవసాయ పద్ధతులలో——వ్యక్తిగతకర్షక వ్యవసాయ పద్ధతులలో వున్న ప్రవీణుల్లోని ప్రముఖులు, మాసోవియటు యూనియన్‌లో నివసించుతూవున్న జాతులను గూర్చి, జాతీయవిధానమును గూర్చి బాగా తెలిసిన వారిలో ముఖ్యులు సభ్యులుగ వున్నారు. ఈ కేంద్రసంఘంలో మాపక్షవిజ్ఞానమంతా కేంద్రీకరింపబడింది. ఏ ఒక వ్యక్తి సలహాలనుగాని, అభిప్రాయములనుగాని, వుపపాదనలనుగాని సరిచేయడానికి ఇతరులలో ప్రతివానికీ అవకాశముంది. తనఅనుభవాన్ని సమర్పించి సహాయపడేందుకు ప్రతివ్యక్తి శక్తికలిగివున్నాడు. అది యింకొక రకంగా వుండి వ్యక్తులే నిర్ణయంచేసి వున్నట్లయితే మావనిలో మేము ఘోరమైన అనేక తప్పులు చేసివుండేవాళ్ళము. మేము మానిర్ణయాలను యితరులు సరిచేయడానికి యింతశ్రద్ధ వహిస్తున్నాం కాబట్టి సాధారణంగా సరియైన నిర్ణయాలకు రాగలుగుచున్నాము.

లడ్విగ్ : భూగర్భంలో రహస్యంగా అనేక సంవత్స రాలు పనిచేసి అనుభవం గడించారు. శాసనవిరుద్ధంగా ఆయు ధాలనీ, గ్రంథాలనీ అనేకసారులు మీరు పంపించిన రోజులు కూడా వున్నై. మీ అనుభవమునుంచి సోవియటు ప్రభుత్వ శత్రువులు నేర్చుకుని ఆ విధానాలతోనే సోవియటు ప్రభు త్వంతో పోట్లాడుతా రని మీ రనుకుంటారా ?

స్టాలిన్ : అవును; అందుకు చాలా వీలుంది.

లడ్విగ్ : మీప్రభుత్వము దానిశత్రువులతో పోట్లాడే టప్పుడు చూపించిన క్రౌర్యమునకూ, కఠినత్వమునకూ అది కారణం కాదూ ?

స్టాలిన్ : కాదు, అది ముఖ్యకారణం కాదు. చరిత్రలో నుంచి మనం కొన్ని వుదాహరణలు చూపించవచ్చు. బోల్షి విక్కులు అధికారానికి వచ్చినమొదట్లో వారు శత్రువులయెడల మందమైఖరితో మృదువుగానే ప్రవర్తించారు. మెన్షవిక్కులు నక్రమసంఘంగానే వుండసాగేరు. వాళ్ళు తమ పత్రికనుకూడా నిర్విఘ్నంగా సాగించుకున్నారు. సోషలిష్టు విప్లవకారులు కూడా బహిరంగంగా పనిచేసుకోగలిగారు. వాళ్ళకు ఒక పత్రిక వుంది. శాసనసమ్మతకార్యవాదు లగు ప్రజాస్వామ్యవాదులూ తమ పత్రికను నడుపుతూనే వున్నారు. జనరల్ క్రాస్‌నాల్ లెనిన్‌గ్రేడ్ పట్టణంమీద విప్లవవ్యతిరేకంగా తిరుగు బాటుచేసి మాచేతుల్లో చిక్కినప్పుడు యుద్ధనిబంధనల ప్రకారం అతనిని మేము బందీగా పట్టుకొని వుండవలసింది. నిజానికి మే మతన్ని తుపాకిగుండు కెరచేయవలసినదే. కాని అతని గౌరవవాక్యాన్ని

తీసుకుని విశ్వసించి వదలిపెట్టాము. ఫలితం ఏమైంది? అటు వంటి మందమైన ఖరి, సరళస్వభావము సోవియటు ప్రభుత్వబలానికే చేటని—వినాశకరమని తెల్లమైనది. కార్మికవర్గ శత్రువుల యెడల అట్టి మాంద్యము చూపించడం గొప్పపొరపాటు. ఆపొరపాటును దిద్దుకోకుండా ఇంకా ఎప్పుడూ అదే చేస్తూవున్నట్లయితే, కార్మికవర్గానికి అపచారము చేయడమూ, వంచించడమూ అయ్యేది. ఇది త్వరలోనే బాగా స్పష్టమైపోయింది. శత్రువులఎడల మేమెంత మందగతిని ప్రవర్తించితే వాళ్ళప్రతిఘటనకూడా అంత అధికమవుతుందని తేటతెల్లమైంది. త్వరలోనే సోషలిష్టు విప్లవకారుల్లోని రైటిస్టులైన—గాజ్ మొదలైనవాళ్ళున్నూ, మెన్షవిక్ రైటిస్టులున్నూ విప్లవ వ్యతిరేక తిరుగుబాటును లేవదీయడానికి లెనిన్‌గ్రేడ్‌లో సైనిక శిక్షణ ఇవ్వసాగేరు. దానిఫలితంగా మావిప్లవ యాత్రికు లనేకమంది నశించారు. మేము గౌరవవాక్యమును తీసుకుని విశ్వసించి విడిచిపెట్టిన క్రాస్‌నాల్ కాసక్కులను సైనికులుగా తయారు చేశాడు. మామంటావుతోపాటు అతడు సైనికనికాయనిర్వహణంచేసి రెండు సంవత్సరాలపాటు సోవియటు ప్రభుత్వాని కెదురుగా సాయుధపోరాటం జరిపాడు. ఈ సైనికాధిపతులకు వెనుక అండగా ఫ్రాన్సు—ఇంగ్లండు—అమెరికా—జపాను మొదలగు ధనికవాదుల రాజ్యాలప్రతినిధులు నిలబడ్డారని త్వరలోనే తెలిసిపోయింది. అందుచేతనే మందపద్ధతి పొరపాటని గ్రహించి నమ్మేము. అట్టి శత్రువులను ఎదుర్కొని అణచివేయ

డానికి నిర్దయాత్మక విధానమే అవలంబించాలని మా స్వానుభవము బోధించింది.

లడ్విగ్ : సోవియట్ యూనియన్‌లోని ప్రజలలో అధిక సంఖ్యాకులు సోవియట్ ప్రభుత్వమంటే భయంతోనూ, హడలుతోనూ, నివసించుతున్నారనీ, ఆభయంమీాదనే కొంత వరకు సోవియట్ ప్రభుత్వ స్థిరత్వ మాధారపడి వుందనీ నాకు తోస్తుంది. ప్రభుత్వాన్ని స్థిరంగా కాపాడడానికి భయాన్ని ఆవేశింప చేయడం అవసరమనే విషయం తెలిసినప్పుడు వ్యక్తిగతంగా మీాలో ఏ ఏ భావాలు రగుల్కొనునో తెలుసుకోవాలని వుంది. మీా కామ్రేడ్సుతో మీా స్నేహితులతో మీాకు గల సంబంధముపట్ల యితరవిధానాలు అవలంబిస్తారు; భయము నావేశింపజేసే విధానా లక్కడ అవలంబించనే అవలంబించరు. అయినా ప్రజలు భయంతో ఆవేశింప చేయబడాలి.

స్టాలిన్ : పొరపాటు బడ్డారు. ఇంకా అనేకమంది కూడా యిదే పొరపాటు బడతారు. భయపెట్టుటతోనూ, హింసావాదంతోనూ 14 సంవత్సరాలు అధికారమును నిలబెట్టుకోవడమూ, కోట్లకొలది ప్రజల సహకారమును పొందడమూ సాధ్యమే నని మీా రనుకుంటూరా? కాదు. అది అసాధ్యము. భయాన్నావేశింప జేయడంలో జారులప్రభుత్వానికి తెలిసినంత మ రేప్రభుత్వానికీ తెలియదు. దానికీవిషయంలో దీర్ఘకాల విశేషానుభవము వుంది. ఈ విషయంలో దానికి యూరపియన్ ధనికవర్గం ముఖ్యంగా ఫ్రెంచి భూర్జువావర్గం అన్నివిధాల సహాయం చేసింది. పైగా ప్రజలను భయపెట్టడం జారిస్టు

ప్రభుత్వానికి నేర్పింది. అయినప్పటికీ ఎంత అనుభవమున్నా, యూరపియన్ భూర్జువావర్గ మెంత సాయంచేసినా జారుప్రభుత్వం కూలిపోకుండా కాపాడలేకపోయింది భయవిధానం. చివరకు జారిజం అంతరించి పోయింది.

లడ్విగ్ : కాని రోమనావు (జారు) లు 300 సంవత్సరాలు పరిపాలించారు.

స్టాలిన్ : అవును. కాని ఈ 300 సంవత్సరాల్లోనూ ఎంత అసంతృప్తి కలిగింది! ఎన్నితిరుగుబాటులు జరిగినై ? స్టాంకారేజిన్ తిరుగుబాటు, ఎమిలియన్ పుగాచెవ్ తిర్గుబాటు, డిసెంబిరిస్టుల తిరుగుబాటు, 1905_1917 ఫిబ్రవరి_1917 అక్టోబరు విప్లవాలు. అదీగాక పూర్వం జారులహయాంలోవున్న రాజకీయ, నాగరకతా జీవితానికి—యీనాటి జీవితానికీ పూర్తిగా తేడా వుందని నేను వేరే చెప్పనక్కరలేదు. ఆకాలపు ప్రభువులు అంతకాలం అధికారం నిలువుకో గలగటానికి ప్రజాసామాన్య అజ్ఞాన—విధేయత—రాజకీయ దాస్యాలే కారణము. ఇక యునైటెడ్ సోవియట్ సోషలిష్టు రిపబ్లిక్‌లోని ప్రజలు—కార్మిక—కర్షకులు మీ రనుకున్నంత అజ్ఞానులు—సాధువులు—విధేయులు—భయావేశితులు గారు. యు. ఎస్. ఎస్. ఆర్. ప్రజలనుగూర్చి యూరపులో యింకా అనేకమందికి బూజుపట్టిన అభిప్రాయాలే వున్నాయి. రష్యాప్రజలు మొదట విధేయులని, తర్వాత సోమరిపోతులనే భావాలు వాళ్ళు చిత్రించుకుంటారు. ఆదృష్టి, ఆభావన యిప్పుడు పనికిరాదు. అవి పూర్తిగా తప్పుడు కూతలు. యూరపులో రష్యనులను గూర్చిన ఈఅభిప్రాయం

జారులకాలంలో ఏర్పడింది. ఆరోజుల్లో రష్యను భూస్వాములు ప్రజలను దోచుకొని మూటగట్టినదంతా తగులబెట్టడానికీ, సోమరులై విలాసాలతో కాలం వెళ్ళబుచ్చడానికీ ప్యారిస్ పట్టణంలో మూగుతూ వుండేవారు. వాళ్ళకు గుండెలేదు. ఎదుములు వంగేవే కావు. వట్టిశుంఠలు. రషియన్ సోమరితనం అనే భావం ఈవిధంగా పుట్టుకొచ్చింది. కాని ఆభావం ఈనాటి రషియన్ కర్షకులకూ—కార్మికులకూ వర్తించదు. చెమటోడ్చి దినబత్తెముల సంపాదించిన—సంపాదించుతూ వున్న మాకార్మిక కర్షకుల కెలా వర్తిస్తుంది? ఆ పదం అత్యల్పకాలంలో మూడుమార్లు విప్లవంచేసి జారిజమునూ, భూర్జువాయిజమునూ ధ్వంసంచేసి సోషలిష్టుసమాజాన్ని నిర్మించుటకు విజయవంతంగా కృషిచేస్తున్న కార్మిక కర్షకులను విధేయులనీ, సోమరిపోతులనీ అనుకోవడం ఆశ్చర్యం.

ఈ దేశంలో ప్రతివిషయాన్నీ ఒక్కవ్యక్తే నిర్ణయిస్తాడా అని ఇంతకు ముందే మీ రడిగారు. కాదు. యిప్పు డే పరిస్థితుల్లోనూ మాకార్మికు లొకేవ్యక్తి ఆధిపత్యాన్ని సహించలేరు. అత్యద్భుతాధికారం కలిగివున్న వ్యక్తులైనాసరే ప్రజాసామాన్యపు విశ్వాసాన్ని కోల్పోగానే ఎక్కడా దృష్టిపథంలో లేకుండా భ్రష్టులై పోతారు. ప్లెఖనోవ్ అసాధారణాధికారం కలిగి వుండేవాడు. మరి ఏం జరిగింది? రాజకీయ దోషములు చేయసాగగానే కార్మికులు—ప్రజలు అతణ్ణి ఈసడించి—విసర్జించి—మరచిపోయారు. మరొక వుదాహరణకూడా చూడండి. ట్రాట్స్కీ ప్లెఖనోవ్ అంతకాకపోయినా అతనుకూడా మంచి

అధికారం కలిగినవాడే. ఏం జరిగింది? అతను కార్మికులతోడి సంబంధం పోగొట్టుకోగానే కార్మికులు కూడా అతన్ని మర్చి పోయారు.

లడ్విగ్ : పూర్తిగా మరచిపోయినట్లేనా?

స్టాలిన్ : అప్పుడప్పుడూ పగతో మాత్రమే కార్మికులతణ్ణి జ్ఞాపకంచేసు కుంటారు.

లడ్విగ్ : అందరూ పగతోనేనా? జ్ఞాపకం చేసుకునే దతన్ని.

స్టాలిన్ : వర్గచైతన్యంగల మాకార్మికులు ట్రాట్స్కీని పగతో— చీదరతో— అసహ్యముతో జ్ఞాపకంచేసుకుంటూ వుంటారు. నిజమే సోవియట్ ప్రభుత్వమంటే భయపడి దానితో పోరాడే ప్రజలు బహు కొద్దిమందిమాత్రమే వున్నారు.. వాళ్ళయినా యిప్పుడు నశించిపోతున్నారు. వాళ్ళను నేను తుద ముట్టించివేస్తా. రైతులలో * కులకు లను బహుకొద్దిమందిని గురించి నేను మాట్లాడుతున్నాను. ఈ విషయంలో భయోత్పాతవిధానాన్ని మాత్రమే అవలంబించి వూరుకోవడము లేదు. కేవలం భయపెట్టడంకంటే మరోఅడుగు ముందుకు వేస్తారు మాబోల్షివిక్కులు. ఈభూర్జువాహారను పెరికివేయడమే మాలక్ష్యం.

---

* కులకు లంటే సాముదాయక వ్యవసాయపద్ధతిలో చేరక, నిరక్షర కుక్షు లయ్యే ప్రజలను దోచుకోవడం బాగా తెలిసిన క్రూరధనిక రైతులు. ఈ కులకులను రూపుమాపడంలో కమ్యూనిష్టులందరు ఏకాభిప్రాయులే.

సోవియటు యూనియన్‌లో శ్రమజీవులు, కర్షక—కార్మికులు మొత్తం జనాభాలో నూటికి 90 వంతున వుంటారు. అంతకు తగ్గరు. వీళ్ళందరూ సోవియట్ ప్రభుత్వ పక్షంగా నిలబడతారు అందులో అతి అత్యధికసంఖ్యాకులు సోవియటు పరిపాలనను చురుకుగా బలపరుస్తారు. సోవియట్ పరిపాలన కర్షక—కార్మికుల ప్రయోజనములను వృద్ధిచేయడం వల్లనే వాళ్ళలా చేస్తారు సోవియట్ స్థిరత్వానికి యిదే పునాది. అంతేగాని ఆరోపించబడిన భయోత్పాతవిధానం కాదు.

లడ్విగ్ : ఈ సమాధాన మిచ్చినందులకు ధన్యవాదాలు. మీకు చోద్యంగా కన్పించే మరొక ప్రశ్న వేస్తూ వున్నందుకు దయతో క్షమించండి. మీ జీవితచరిత్రలో అక్కడక్కడా 'బందిపోటులు' అనేవి చదివాను. స్టెంకా రేజిన్ యొక్క మూర్తిమత్వములో మీరేమన్నా శ్రద్ధతీసుకున్నారా? అతనిని 'అదర్శపూర్వక బందిపోటుదొంగ' అంటారు అతని విషయంలో మీవైఖరి ఏమిటి?

స్టాలిన్ : బొలోట్నికొవ్, రేజిన్, పుగాచెవ్ మొదలైన వాళ్లందరి ఎడల మాబోల్షివిక్కులకెప్పుడూ శ్రద్ధవుంది. భూస్వాముల కాడిక్రింద అణచివేయబడ్డ తరగతుల అసంతృప్తీ, కర్షకుల నిరవధికమగు తిరుగుబాటూ వీళ్ళచర్యలందు ప్రతిబింబిస్తున్నట్లు మేము తలంచెదము. రైతులు మొదటచేసిన యిట్టి తిరుగుబాటుల ప్రయత్నాల చరిత్రంటే ఎప్పుడూ మే మెంతో శ్రద్ధతో చదువుతూవచ్చాం. కాని వాళ్ళకీ—బోల్షివిక్కులకీ సామ్యంలేదు. స్టెంకారేజిను లేవదీసిన తిరుగుబాటుల

వలె నిర్మాణరహితములూ, బందిపోటు తరహాకు చెందినవీ కాకపోయినా ప్రత్యేకంగా రైతులు యేకాకులై నడిపిన తిరుగుబాటులు విజయవంతములు కాజాలవు. రైతు—కార్మికుల తిర్గుబాటులు ఏకముజేసినప్పుడే, రైతులతిరుగుబాటులకు కార్మికులు నాయకత్వం వహించి నడిపినప్పుడే రైతులతిర్గుబాటులు విజయవంతము లవగలవు. కార్మికవర్గంనడిపిన సంయుక్తతిరుగుబాటు మాత్రమే దానిలక్ష్యాన్ని సాధించడానికి అవకాశముంది. అదీకాక రేజిన్—పుగాచెవ్ లను గూర్చి మాట్లాడేటప్పుడు వాళ్ళు జారిస్టులని మన మెప్పుడూ మరచిపోగూడదు. భూస్వాములకు వాళ్ళు వ్యతిరేకులే గాని "మంచిజారు కావాలి" అని వాళ్ళకోరిక. అదీ వాళ్ళమూలసూత్రం. ఇప్పుడు వాళ్ళతో బోల్షివిక్కులకు సామ్యంపెట్టడం పనికిరాదని తెలుసుకొనివుంటారు.

లడ్విగ్ : ఇంక మీ జీవితచరిత్రనుగూర్చి కొన్ని ప్రశ్న లడుగుతాను. నేను మాజరిక్ (జెకోస్లోవేకియా అధ్యక్షుడు)ను సందర్శించినప్పుడు మాటలసందర్భంలో ఆయన తన ఆరుసంవత్సరముల వయస్సులోనే తాను సోషలిస్టునని తెలుసుకున్నట్లు నాతో చెప్పాడు. మీరు సోషలిస్టు ఎలా అయ్యారు? ఎప్పుడయ్యారు?

స్టాలిన్ : నేను నా ఆరో ఏటనే సోషలిష్టు నయ్యానని వక్కాణించలేను. పదివన్నెండు సంవత్సరాల వయస్సులోకూడా కాదు. ట్రాన్సుకాకేషియాలో రషియన్ బోల్షివిక్కుల కొన్ని అక్రమ సంఘాలతో సంబంధం పెట్టుకున్నప్పుడు, నాపదిహేనో

ఏడు, నేను విప్లవోద్యమంలో చేరాను. ఈసంఘముల ప్రభావం నాపైన బాగా ప్రసరించింది. నిషేధింపబడిన మార్క్సియన్ (సామ్యవాద) గ్రంథములు చదవా లనే అభిరుచిని నాకు కలిగించిం దీ సంఘాలే.

లడ్విగ్ : అయితే, మీారు తిరుగుబాటుదారు ఎలా అయ్యారు? బహుశా మిమ్మలను మీాతలిదండ్రులు సరిగా చూడకపోవడం మూలాన యీాపనిజరిగిందా ఏమిటి?

స్టాలిన్ : కాదు. నాతలిదండ్రులు చదువుకున్న వాళ్ళు కాకపోయినా నన్నేవిధంగానూ నిరాదరించలేదు. అప్పుడు నేను క్రైస్తవమత విద్యాలయంలో విద్యార్థిని. ఆపాఠశాల సంగతి అంతా వేరు. అవమానకరమైన ఆ హాయీామూా, మతబోధక విధానాలూ చూచి ఒడలు మండెక్కి నేను విప్లవవాదినై నిజ విప్లవసిద్ధాంతము మార్క్సిజమే నని విశ్వసించువాడినయ్యాను.

లడ్విగ్ : మతబోధకులలో మంచిగుణా లేమైనా వుంటా యని మీా రంగీకరిస్తారా?

స్టాలిన్ : అవును. వాళ్ళుచేసే పనిలో నియమంతోనూ, ఓర్పుతోనూ ప్రవర్తిస్తారు. కాని వాళ్ళ నియమాలన్నిటికీ పునాది గూఢచర్యా, పరులనుగూర్చి రంధ్రాన్వేషణా, యితరుల ఆత్మలకూ తమకూ సంబంధంలేనిదే అన్వేషించుటా, నానా విధ హింసల పాలుచెయ్యడమూ మాత్రమే. అందులో వున్న మంచి ఏమిటి? వుదాహరణకి పాఠశాలలోనివాళ్ళ గూఢ చర్యలు వుదయం తొమ్మిది గంటలకు భోజనానికి గంట కొడ

తారు. అంతా భోజనశాలకు పోయి భోజనానంతరము తిరిగి గదులకు పోతే అవి సోదాచేయబడినట్లు పుస్తకాలు బీరువాలూ అన్నీ వెతికి చిందరవందర చేయబడి వుంటాయి. అందులో మంచి అనే దే ముంది?

లడ్విగ్ : అమెరికా దేశానికి సంబంధించిన ప్రతిదానినీ అమితంగా గౌరవించడం—కాదు పూజించడం అనవచ్చు నేమో మీ సోవియట్ యూనియనులో చూస్తున్నాను. అమెరికా మహాధనికవాదుల, మహాభోగుల దేశం; అమెరికా ధనికవాదదేశాల్లో మొనగాడు. ఈ భావము మీకార్మికులుకూడ చూపుతున్నారు. కారులు—రైళ్ళు మొదలగు యంత్రవాహనాలను గూర్చియే కాక సాధారణంగా అమెరికనులనే గౌరవిస్తున్నది మీ కార్మికవర్గం. దీనిని మీ రెలా సమర్థించుతారు?

స్టాలిన్ : మీది అతిశయోక్తి. అమెరికాదేశానికి సంబంధించిన ప్రతిదానికీ మేము గౌరవంచూపించం. కాని పరిశ్రమలో, పారిభాషిక విజ్ఞానంలో, సాహిత్యంలో, జీవితంలో అమెరికనులు ప్రదర్శించే ప్రావీణ్యతను మేము గౌరవిస్తాము. అమెరికా సంయుక్తరాష్ట్రములు ధనికవాద దేశ మనేది మేము ఎప్పుడూ మరిచిపోము. అయితే అమెరికనులలో నైతికంగా—శారీరకంగా ఆరోగ్యవంతులై పనిఅన్నా, క్రియాపూర్వకవ్యవహారాలన్నా సుముఖులై ఖరిని చూపేవాళ్ళు అనేకమంది వున్నారు. వాళ్ళ ఆనిపుణతను, సాధనావిధాన సౌలభ్యమును మేము గౌరవించుతాము. అమెరికా అద్వితీయధనికవాదదేశమే అయినప్పటికీ, వాళ్ళ పారిశ్రామిక విధానాలలో, వాళ్ళ

వృత్తి అభ్యాసములలో ప్రజాస్వామికశక్తి—ప్రజాస్వామిక చైతన్యం కొంతవుంది. ఇది అనాది సిద్ధయూరపియన్ ధనికవాద దేశాలలో లేదు. అక్కడ మధ్యయుగ జమీందారీ దురహంకారశక్తి, స్వల్పజనాధిపత్యచైతన్యం యింకావుంది.

లడ్విగ్: మీరు చెప్పేది యెంతవరకు యథార్థమో అని మీకు అనుమానమన్నా లేదు.

స్టాలిన్: బహుశా, నాకు అనుమానం వుంది. ఎవరికి తెలుసు? యూరవులో సాంఘికరూపంగా జమీందారీ విధానము నశించినా, యిప్పటికీ జీవితములో, నడతలో, గుణాలలో అది యింకా చాలా శేషించివుంది ఇంజనీయర్లు, ప్రవీణులు, శాస్త్రకారులు, గ్రంథరచయితలు, జమీందారీ కూటములలో నుండియే పుట్టుకొస్తున్నారు. పరిశ్రమలో, పారిభాషిక విజ్ఞానంలో, సాహిత్యములో, జీవితములో వీళ్ళు ప్రభువుల యీ దురహంకారశక్తిని ప్రవేశపెడుతున్నారు. జమీందారీ సాంప్రదాయాలు యింకా పూర్తిగా నిర్మూలించబడలేదు. అమెరికాకు యీ విషయం వర్తించదు. అమెరికా "స్వతంత్ర వలస ప్రజల" దేశము; భూస్వామికవర్గమూ, స్వల్పజనాధిపత్యమూ లేని దేశము. అందుచేతనే, వృత్తిజీవితములో అమెరికను పద్ధతులు అంతదృఢంగా, శాస్త్రీయంగా, సాధనాసులభంగా వుంటాయి. కార్మికవర్గములో జన్మించి పైకివచ్చి అమెరికాకు వెళ్ళిన మా పారిశ్రామికనాయకులు యీసద్గుణము వెంటనే గమనించారు. బాహ్యవేషము మూలముననే ఇంజనీయ రెవరో, కార్మికు డెవరో విభజనగా అమెరికాలో చెప్పడం కష్టమని

వాళ్ళు సంతోషపూర్వక ఆశ్చర్యంతో చెపుతారు. వాళ్ళకు అది యిష్టం. కాని, యూరపులో యీ విషయమంతా పూర్తిగా భేదమే.

కాని, మాజాతి యే ప్రత్యేక జాతియందన్నా, లేక యే ప్రత్యేకజాతిలోని అత్యధిక ప్రజలయందన్నా సానుభూతి చూపుతూ వున్నదని చెప్పవలసివస్తే, జర్మనులయందు అనిచెప్పి తీరాలి. అమెరికనులనుగూర్చి మాకున్న భావాలను జర్మనుల నుగూర్చి మాకున్న సానుభూతితో పోల్చజాలము.

లడ్విగ్ : ప్రత్యేకం జర్మనులయం దెందుచేత ?

స్టాలిన్ : ఈవిషయం వాస్తవమనిమాత్రం పేర్కొన్నాను.

లడ్విగ్ : జర్మనీదేశానికి, సోవియటురషియాకూ మధ్య పారంపర్యంగా వస్తూవున్న మైత్రీపూర్వక విధానము వెనక్కు నెట్టివేయబడుతుం దని కొంతమంది జర్మను రాజకీయవేత్తలు యిప్పుడిప్పుడు తీవ్రభయం సూచిస్తూన్నారు. సోవియటు యూనియనుకూ పోలెండు దేశానికి మధ్యజరిగే రాయబారాల ఫలితంగా యీభయాలు వుద్భవించినై. రషియాదేశము వర్సైల్సు (సంధి 1918) విధానానికి వ్యతిరేకమనీ, దానిని వొప్పుకోవాలనే తలంపు రషియాకు లేనేలేదనీ అనుకునే జర్మనీప్రజలందరూ రషియాదేశము పోలెండుదేశముయొక్క ప్రస్తుత సరిహద్దులను యీ రాయబారాల ఫలితంగా అంగీకరించితే దిగ్భ్రాంతి చెందుతారు?

స్టాలిన్: పోలెండు స్వామ్యములనూ, సరిహద్దులనూ రాయబారాలద్వారాగాని, పోలెండుతో చేసుకునే సంధిద్వారా గాని రష్యాదేశము అంగీకరించడానికి యేదన్నా చేస్తుందేమో నని జర్మనీలో కొంతమంది రాజకీయతంత్రజ్ఞులు అసంతృప్తినీ, భయమునూ సూచిస్తూవున్నారు. నాకు తెలుసు నా అభిప్రాయంలో అట్టిభయాలకు తావులేదు. పరరాజ్యాక్రమణరహిత సంధిని యేప్రభుత్వంతోనైనను చేసుకోవడానికి మే మెప్పుడూ యిష్టమునే ప్రకటించాము. కొన్నిదేశాలతో యింతకుముందే మేము అట్టిసంధులు చేసుకున్నాము. పరరాజ్యాక్రమణ రహిత సంధిని పోలెండుతో చేసుకో గోరుతున్నామని బహిరంగంగా మేము ప్రకటించాము మేము పోలెండుతో పరరాజ్యాక్రమణ రహితసంధిని చేసుకోవడానికి సిద్ధంగావున్నామని ప్రకటించి నప్పుడు, అది కేవలం శూన్యప్రకటన కాదు. దాని అర్థము మేము నిజంగా అట్టిసంధి చేసుకోవాలని కోరుతున్నామనియే మేము విచిత్రజాతిరాజకీయవేత్తల మని మీకు యిష్టముంటే అనవచ్చును. ఇవ్వాళ వకటిచెప్పి, రేపు దానిని మరచిపోయే రాజకీయవేత్తలు, లేక అట్టివాగ్దానం చెయ్యలేదని—అదికూడా సిగ్గన్నలేకుండా—చెప్పే రాజకీయవేత్తలు వున్నారు. మా పద్ధతి అది కాదు. బయట మేము చేసేదంతా మాదేశంలోని కార్మిక కర్షకులకు అనివార్యంగా తెలిసిపోతుంది మేము వొక విషయంచెప్పి, యింకొకవిషయం చేస్తే మాఅధికారం వూడి పోతుంది. పోలెండుదేశీయులు మాదేశముతో పరరాజ్యాక్రమణ రహితసంధిని చేసుకోవడానికి రాయబారాలు సాగించా

లనే యిష్టమును ప్రకటించగానే, మేము సహజంగా యిష్టపడి, రాయబారాలు మొదలుపెట్టాము.

జర్మనుల అభిప్రాయంలో, రాయబారాల ఫలితంగా కలుగబోయే అపాయకరవిషయం యేమిటి? జర్మను దేశీయుల యెడల మేము చెడువైఖరిని అవలంబించడమా? సోవియటు రషియాకూ, పోలెండుకూ మధ్యవున్న సరిహద్దులను మార్చ డానికి లేక పోలెండు స్వాతంత్ర్యమునకు భంగముకలిగించ డానికి మేము (పశు) బలంగాని, ఆక్రమణమునుగాని వుపయో గించమని సంధిపత్రములో ప్రకటించితీరాలి. మేము పోలెండుకు యిట్టి వాగ్దానం చేసినట్లుగానే, పోలెండు మాకు యిట్టి వాగ్దా నం చెయ్యాలి. పోలెండు స్వాతంత్ర్యమునకు భంగముకలిగించు టకుగాని, పోలెండు సరిహద్దులను మార్చడానికిగాని మేము యుద్ధమునకు దిగము అని సంధిపత్రములో ప్రకటించాలి; రషియా విషయములో పోలెండుదేశీయులును సంధిపత్రములో అలాగే ప్రకటించాలి; వుభయులమూ అలా ప్రకటించనిది యేసంధియును జరుగదు. ఆ నిబంధనలేనిది సంధిప్రశ్న పుట్టనే పుట్టదు. మేము చేయగలిగినదంతా యింతే వర్సైల్సు విధా నమును మేము అంగీకరించుతున్నామని దాని అర్థమా? అది కాదు. సరిహద్దులను అంగీకరిస్తున్నామని దాని అర్థమా? అదీ కాదు, పోలెండు యింతకుముందెప్పుడుగాని, యికముందు గాని మాసరిహద్దులకు యెలా వుత్తరవాదికాదో, అలాగే మేము పోలెండుసరిహద్దుల విషయంలోనూ యింతకుముందు గాని, ఇకముందుగాని వుత్తరవాదులము కాము. ఇంతకుముందు

జర్మనీతో మా కెట్టి మైత్రి పూర్వకసంబంధం వుందో, భవిష్యత్తు లోనూ అదే వుంటుంది. ఇది నాదృఢవిశ్వాసము.

కాబట్టి మీరు మాట్లాడే అనుమానాలకు యేమాత్రమూ తావులేదు. కొంతమంది పోలెండుదేశీయులూ, కొంతమంది ఫ్రెంచివాళ్ళూ వేసిన అపవాదులవలన యిట్టిఅనుమానాలు కలిగినై. పోలెండు సంతకంచేస్తే మేము సంధిపరతులను ప్రకటిస్తాము; అప్పుడు ఆ అనుమానాలు అదృశ్యంకాగలవు. అందులో జర్మనీకి వ్యతిరేకమైన దేదీలేదని అప్పుడు మీరు చూడగలరు.

లడ్విగ్ : ఈ ప్రకటనకు మీకు కృతజ్ఞుడను. మిమ్మ్మలను ఒకప్రశ్న అడుగుతున్నాను. అన్నివిషయాలలోనూ సమానత్వము అనే దానినిగూర్చి పరిహాసాస్పదముగా అర్థమిస్తూ మీరు "సర్వసమానత్వమును" గూర్చి మాట్లాడుతున్నారు. కాని, సర్వవిషయ సమానత్వము సోషలిస్టు ఆదర్శముకాదా యేమిటి ?

స్టాలిన్ : ప్రతివాడికీ సమానజీతము, ప్రతివాడికీ సమానంగా గోధుములు పంచిపెట్టడం, అందరికీ వొకే పరిమాణంలో రొట్టెయివ్వడం, ప్రతివాడూ వొకే రకపు బట్టలు ధరించడం, ప్రతివాడూ వొకేరకపు వస్తువులు వొకేపరిమాణంలో తీసుకోవడం—యిట్టివిషయాలన్నిటిలో సమానత్వము వున్న సోషలిజాన్ని మార్క్సిజము యెరుగనే యెరుగదు. వర్గములు పూర్తిగా నిర్మూలించబడేవరకూ, శ్రమ యనేది బ్రతుకుతెరువుగా గాక, జీవిత ముఖ్యావసరముగా, సంఘశ్రేయంకోసం

ఐచ్ఛికంగా చేసే శ్రమగా మారేవరకూ ప్రజలకు వాళ్లుచేసిన శ్రమయొక్క పరిమాణమునుబట్టి జీతమిస్తూవుండాలి అనిమాత్రమే మార్క్సిజం ప్రకటిస్తుంది. "చేయగలిగినంతచెయ్యి, చేసినదానికి తగినట్లు జీతం తీసుకో"—యిది సోషలిజమును గూర్చిన మార్క్సియన్ సూత్రము. ఇది కమ్యూనిజానికి, కమ్యూనిస్టుసంఘానికి ప్రథమదశ. కమ్యూనిజముయొక్క అంతిమదశలో మాత్రమే తమశక్తికి తగినంతపనిచేసిన ప్రజలు తమ అవసరాలకు తగినంత ప్రతిఫలం తీసుకుంటారు: "చేయగలిగినంతచెయ్యి, అవసరాలకు తగినంత జీతంతీసుకో."

ప్రజల అవసరాలు అనేకరకాలుగా వుంటాయి; సోషలిజము వున్నప్పటికీ అవి ఆమార్పులతోనే వుంటాయి. ప్రజలు తమ అభిరుచులలో, తమ అవసరాల పరిమాణములో, రకములో భిన్నభిన్నంగా వుంటారనేవిషయం సోషలిజం యెప్పుడూ కాదనలేదు. 1875 గోథా కార్యక్రమముమీద స్టర్నరు వ్రాసిన విమర్శనమీద మార్క్స్ వ్రాసినవిమర్శన చదవండి; తరువాత యింకా మార్క్సు, ఏంగిల్సు, లెనిను వ్రాసిన గ్రంథాలు చదవండి; వాళ్ళు యెంతతీవ్రముగా సర్వసమానత్వమును యెదుర్కొన్నదీ తెలుసుకుంటారు. సర్వసమానత్వం యొక్క వేళ్ళు రైతులచిత్తవృత్తిలో, అనాదిసిద్ధకర్షక "కమ్యూనిజము" యొక్క మనస్తత్వంలో పాదుకునివున్నవి. సర్వసమానత్వము మార్క్సియన్ సోషలిజానికి పూర్తిగా భిన్నమైనది. మార్క్సిజమును గూర్చియే మిా తెలియనివాళ్ళకుమాత్రమే బోల్షివిక్కులు సంపదనంతా గణనిధిక్రింద పోగుచేసి సమా

నంగా పంచిపెట్టగోరుతారు అనే అనాదిసిద్ధ అభిప్రాయంవుంది. మార్క్సిజముతో యెట్టి విధంగానూ సంబంధంలేని వాళ్ళదే ఆ అభిప్రాయము. క్రాంవెల్ కాలంనాటి, ఫ్రెంచి విప్లవకాలం నాటి పూర్వీక "కమ్యూనిస్టుల" మాదిరి ప్రజలకు మాత్రమే సోషలిజమునుగూర్చి యిట్టి అభిప్రాయం వుంది కాని, సర్వసమానత్వవాద "కమ్యూనిస్టులతో" మార్క్సిజానికీ, రషియన్ బోల్షివిజానికీ యేమీ సంబంధంలేదు.

లడ్విగ్ : మీరు సిగరెట్టు కాలుస్తున్నారు స్టాలిన్ గారూ! కథలలోకీ, చరిత్రలోకీ యెక్కిన మీ పొగగొట్టము యెక్కడ వుంది? మాటలూ, కథలూ పోతాయిగాని, కార్యములు శాశ్వతము లౌతా యని మీ రొకసారి చెప్పారు కాని, మీమాటలనూ, కార్యములనూ కొంతవరకూ యేమీ యెరుగని కోట్లకొలది యితరదేశ ప్రజలు కథానిబద్ధమైనమీపొగ పీకనుగూర్చి యెరుగుదు రని నేను చెప్పినప్పుడు నమ్మగోర్తాను.

స్టాలిన్ : ఆచుట్టపీకను యింటిదగ్గర విడిచిపెట్టాను

లడ్విగ్ : మీకు చాలా ఆశ్చర్యంకల్గి చే ప్రశ్న నొక దానిని అడుగుతాను.

స్టాలిన్ : ఆశ్చర్యపడడం యెలానో మారషియన్ బోల్షివిక్కులు మరిచిపోయి చాలాకాలమైంది.

లడ్విగ్ : అవును, మాజర్మనీదేశస్థులుకూడా.

స్టాలిన్ : అవును, మీజర్మనులుకూడా ఆశ్చర్యపడడం కొద్దికాలంలోనే మరచిపోతారు.

లడ్విగ్ : నాప్రశ్న యిది—మీరు అనేక పర్యాయాలు కష్టాలు, అపాయాలూ అనుభవించారు. మీరుహింసింపబడ్డారు. మీరు యుద్ధాలలో పాల్గొన్నారు. మీఆప్తస్నేహితు లనేకులు చనిపోయారు. మీరు మిగిలారు. దీనిని మీరు యెలా సమర్థించ గలరు? మీకు కర్మసిద్ధాంతంలో నమ్మకం వుందా?

స్టాలిన్ : లేదు, కర్మలో నాకు నమ్మకంలేదు. బోల్షివిక్కులకు, మార్క్సిస్టులకు "కర్మ" లో, కర్మసిద్ధాంతములో, శిక్షాసిద్ధాంతములో నమ్మకంలేదు. ఆసిద్ధాంతము కేవలము మూఢవిశ్వాసము, అసంబద్ధము. పూర్వకాలం గ్రీకులు వొక కర్మాధిదేవత మానవుల విధివిపాకమునుని నడుపుతూవుంటుంది అనుకునేవారు. అట్టిదేవతాఖ్యానశేషమే, వుక్కిటి పురాణముల యెంగిలిమెతుకే యీకర్మసిద్ధాంతము.

లడ్విగ్ : మీరు యుద్ధంలో మిగిలారు అనేది ఆకస్మిక—అచింతిత సంభవమూ, కేవలం ఛాన్సు అన్నమాట?

స్టాలిన్ : నేను జీవించివున్నది బాహ్యాభ్యంతర కారణముల సమ్మేళనమువలన కాని దానితో సబంధంలేకుండా, యింకొకరు నాస్థానంలో వుండేవారు; ఎందు చేతంటే యెవరో వొకరు తప్పక యిక్కడ కూర్చోవాలి. కర్మఅబద్ధము ప్రకృతిశాసనానికి అదివిరుద్ధము. నాకు మాయలో నమ్మకం లేదు. అపాయము నన్ను యెందుకు గడిచిపోయింది అనేదానికి కారణాలున్నవి. కాని, విరుద్ధఫలితం కలిగించివుండే యింకాఅనేకకారణపరంపర, యింకా అనేకఛాన్సులు వుండియుండవచ్చును. కర్మ అనేదానికీ దీనికీ యేమీ సంబంధం లేదు.

లడ్విగ్ : ఇతర దేశాలలో లెనిన్ చాలా సంవత్సరాలు ప్రవాసిగా వున్నాడు. మీరు చాలాకాలం యితర దేశాలలో ఉండడానికి సందర్భపడలేదు. అది మీకు అననుకూలమూ, లోపమూ అని మీరు అనుకుంటారా? యూరపులో ప్రవాసులుగా వుండి యూరపునుగూర్చి బాగా తెలుసుకొనియును యిక్కడి ప్రజలతో ప్రత్యక్షసంబంధంలేని వ్యక్తులా, లేక యిక్కడే తమకార్యమును కొనసాగించుతూ వుండియును యూరపునుగూర్చి చాలాతక్కువ తెలిసిన విప్లవకారులా— యెవరు విప్లవానికి యెక్కువ దోహదంచేశారు? విప్లవానికి యెవరు యెక్కువలాభం చేకూర్చారని మీనమ్మిక?

స్టాలిన్ : లెనినును యీపోలికలోనుంచి తొలగించాలి. ఇతర దేశాలలో లెనిను చాలాకాలంగడిపినా, రషియను వ్యవహారములతో, రషియన్ కార్మికవర్గోద్యమముతో రషియాలో నివసిస్తున్నవా ళ్ళెవ్వరూ లెనిను పెట్టుకున్నంతగా గాఢ సంబంధం పెట్టుకోలేదు. లెనిను యితర దేశాలలో వుండగా నేను 1907 లో, 1908 లో, 1912 లో సందర్శించాను ఎప్పుడు సందర్శించినా, రషియాలో క్రియాశూరులగు రాజకీయసేవకుల దగ్గరనుంచి లెనినుకు వచ్చిన వుత్తరాలగుట్టలు నేను చూశాను. రషియాలో వుండిపోయిన వాళ్ళకంటే లెనినుకు యెప్పుడూ యెక్కువ తెలుసు. ఇతర దేశాలలో వుండడం లెనిను కొక మహాభారంగా తలచాడు.

ఇదివరలో ప్రవాసులుగా యితర దేశాలలో వున్న వాళ్ళకంటే మాపార్టీలో యితర దేశాల కెప్పుడూ వెళ్ళని కార్యమేడ్సే

చాలా యెక్కువమంది. రష్యాలో ప్రత్తడిపోయిన వాళ్ళు ప్రవాసితులకంటే విప్లవానికి యెక్కువలాభాలు చేకూర్చారు. ఇదివరలో ప్రవాసులుగా వున్నవాళ్ళు యిప్పుడు ముసలివాళ్ళలో చాలా తక్కువమంది మిగిలారు. మాపక్షంలో యిరవై లక్షల మంది సభ్యులలో వాళ్ళు మొత్తం 100 లేక 200 వుంటారు. కేంద్రసంఘములోని 70 మంది సభ్యుల్లో యితర దేశాలలో యిదివరలో ప్రవాసం చేసినవాళ్ళు ముగ్గురు, నలుగురుకంటే యెక్కువలేరు.

యూరపు విజ్ఞానమునూ, యూరపుపరిస్థితులనూ తెలుసుకోగోరినవాళ్ళు యూరపులోవుండగా అలాచెయ్యడానికి యెక్కువ అవకాశం దొరికింది. ఇతరదేశాలలో యెక్కువ కాలం నివసించనివాళ్ళు, ఆదృష్టితో చూస్తే, కొద్దిగా నష్టపడినట్లే. యూరపియను ఆర్థికశాస్త్రమును, ఆర్థికపరిస్థితులను, పారిభాషిక విజ్ఞానమును, కార్మికవర్గోద్యమ ముఖ్యధోరణులను, కార్మికవర్గోద్యమ ముఖ్యవ్యవస్థలను, సాహిత్యకల్పనములను, శాస్త్రీయ సాహిత్యమును గూర్చి తెలుసుకోవాలంటే యూరపులో నివసించడం ముఖ్యం కాదు. ఇతరపరిస్థితులు సమానంగా వుంటే, యూరపులోనే వుండి యూరపునుగూర్చి తెలుసుకోవడం మరీతేలిక. యూరపులో చాలాకాలం నివసించనివాళ్ళు నష్టపడిందికూడా యెక్కువ లేదు. పైగా, 20 సంవత్సరాలు యితరదేశాలలోవుండి, చార్లొటెన్‌బర్గులోనో, లాటిన్ ప్రదేశంలోనో వుండి హోటళ్లలో బీరు, సారాలు ఆహారించుతూ సంవత్సరాలు గడిపినాకూడా యూరపునుగూర్చి తెలుసుకొనని

వాళ్ళను, యూరపును అర్థంచేసుకోజాలక పోయినవాళ్ళను అనేక కామ్రేడ్సును నేను యెరుగుదును.

లడ్విగ్: ఒకజాతిగా జర్మనులలో స్వాతంత్ర్యప్రేమ కంటే చాలా యెక్కువగా అభివృద్ధిపొందింది క్రమతాప్రేమ అని మీరు గణిస్తారా?

స్టాలిన్: జర్మనీలోని ప్రజలు "లా"ను (శాసనములను) గౌరవించినకాలం వుంది. 1907 లో నేను బెర్లినులో రెండుమూడు నెలలు గడిపినప్పుడు మాజర్మను స్నేహితులు కొందరు శాసనములయందు చూపించిన గౌరవమును జూచి మా బోల్షివిక్కులము నవ్వేవాళ్ళము. మచ్చుకి, వొకచిన్నకథ చెపుతాను.— ఒకసారి సోషల్ డెమాక్రాటిక్ పార్టీలోని బెర్లిను కమిటీ ఫలానా తేదీని, ఫలానాగంటకు బెర్లినులో సభజరుగుతుంది కాబట్టి ఆపక్షసభ్యులందరూ రావలసిందని ప్రకటించింది. చుట్టుపట్ల ఆపక్షశాఖలనుంచి చాలామంది రావాలి. ఒక ప్రదేశంనుంచి 200 మంది నగరంలో టంచనుగా సమయానికి చేరుకున్నారు. కాని, సభాప్రదర్శనానికి హాజరు కాలేను. ప్లాటుఫారములోనుంచి బయటకుపోయే దారిదగ్గర టిక్కెట్టుకలెక్టరు లేకపోవడంచేతను, వాళ్ళటిక్కెట్లు తీసుకునేవాడు యింకొకడెవ్వడూ అక్కడ లేకపోవడంచేతను ఆస్టేషను ప్లాటుఫారము మీదనే వాళ్ళు రెండుగంటలసేపు గుటకలు మింగుతూ ఆగారు. ఆపరిస్థితిలోనుంచి బయటపడడానికి సులభమార్గం రషియన్ కామ్రేడ్సు చూపించవలసివచ్చిందని పరిహాసంగా

అంటారు; అంటే, టిక్కెట్లు యివ్వకుండా యెకాయెకీని ప్లాటు ఫారమును విడిచిపెట్టి నగరములోకి వెళ్ళిపోవడం.

అయితే, జర్మనీలో అటువంటిది యిప్పుడేమన్నా వుందా? ఈదినం జర్మనీలో శాసనాలంటే గౌరవం వుందా? భూర్జువా శాసనక్రమాలను కాపాడడానికి ప్రథములు కావలసిన జాతీయ సోషలిస్టులవిషయం యేమిటి? వాళ్ళు శాసనాలను భగ్నం చెయ్యడం లేదా? వాళ్ళు కార్మికసంఘభవనాలను పగులగొట్టడం లేదా? నిర్భయంగా కార్మికులను వాళ్ళు వధించడం లేదా? భూర్జువాశాసనక్రమా లంటే గౌరవమునంతటినీ విడిచిపెట్టింది నా కెవరిని తోస్తుందో నేను తెలుపను. అవును, యీరోజుల్లో జర్మనులు చాలా మారిపోయారు.

లడ్విగ్ : ఒక్కపక్షముయొక్క నాయకత్వంక్రింద యే పరిస్థితులలో పూర్తిగా, చివరకు కార్మికవర్గమును సంఘీభవింప చేయడం సాధ్యము? కార్మిక విప్లవానంతరము మాత్రమే కార్మికవర్గైక్యతను సనుకూర్చవీలుపడుతుం దని కమ్యూనిస్టులు ప్రకటిస్తారు. అప్పుడుమాత్రమే అది యెందుచేత సాధ్యం కావాలి?

స్టాలిన్ : విజయమును తెచ్చిన కార్మికవిప్లవఫలితంగా కమ్యూనిస్టుపార్టీచుట్టూ కార్మికవర్గమును సంఘీభవింప చేయడం చాలా తేలిక. కాని, నిస్సందేహంగా, చాలావరకు ఆ సంఘీభావము విప్లవానికి ముందే సాధింపబడుతుంది.

లడ్విగ్ : చారిత్రక మహాపురుషులకు వున్న తాధికార వాంఛ ఆటంకమా, వుత్సాహహేతువా?

స్టాలిన్ : భిన్న భిన్న పరిస్థితులలో వున్న తాధికార వ్యామోహము భిన్న భిన్న పాత్ర ధరిస్తుంది. ఒక చారిత్రిక మహాపురుషుని కార్యాచరణములకు, పరిస్థితులనుబట్టి అది వుత్సాహ హేతువు కావచ్చు లేదా ఆటంకము కావచ్చు. తొంభై పాళ్ళు అది ఆటంకమే.

లడ్విగ్ : మహా ఫ్రెంచివిప్లవానికి మీా అక్టోబరు విప్లవము పొడిగింపా, లేక ముగింపా ?

స్టాలిన్: మా అక్టోబరు విప్లవము ఫ్రెంచి విప్లవానికి పొడిగింపూకాదు, ముగింపూకాదు. ఫ్రెంచి విప్లవముయొక్క లక్ష్యము జమీాందారీవిధానమును నాశనంచేసి, ధనికవాద మును స్థాపించడము. అక్టోబరు విప్లవము యొక్క లక్ష్యము ధనికవాదమును నాశనంచేసి సోషలిజమును స్థాపించడమే.



114.72 No.

# ఆదర్శ గ్రంథమండలి నియమాలు:

1. సామ్యవాద, కార్మిక, కర్షక, అంతర్జాతీయ-సామ్రాజ్య వ్యతిరేక వాద సంబంధము లగు పుస్తకములను ప్రకటించును.
2. సం॥ లో 1000 పేజీలకు తక్కువగాని ప్రచురణలు వెలువడుతాయి.
3. ప్రతి పుస్తకము నూరుపేజీలు 4 అణాలు చొ॥ ఖరీదు కలిగి వుంటాయి.
4. చందాదారులుగ చేరుటకు ప్రవేశ రుసుము 2 అణాలును, పుస్తకములకు రు 1-0-0 తక్కువకాకుండా అడ్వాన్సును ముందు చెల్లించాలి.
5. చందాదారులకు వారి అడ్వాన్సు నిల్వ ఉన్నంత వరకు 100 పేజీలకు తక్కువగాని పుస్తకాలు ప్రకటించగనే పోస్టేజి మేమే భరించి పంపుదుము.
6. సం॥ చందా 2-8-0 లు ముందే ఒక్కసారిగా ఇచ్చు వారికి సం॥ లో 1000 పేజీలకు మించిన గ్రంథములు ప్రకటించిననూ మొత్తం గ్రంథాలన్నీ ఖర్చులు భరించి పంపబడును.
7. చందాదారులకు మా వెనుకటి, అంటే, ఆదర్శ గ్రంథ మండలి ప్రచురణములు 33 % కమీషను తగ్గించి పంప బడును.
8. ఆధునిక రాజకీయ గ్రంథాలన్నీ (ఇతరులచే ప్రకటింప బడినవి) సప్లైచేస్తాము. ఇది చందాదారుల సౌకర్యార్థమే.

తెలుగు విశ్వవిద్యాలయ
వరుస సంఖ్య...34207
తేది...13.1.92

## ప్రచురణలో వున్న పుస్తకాలు.

1. మన సంపద
2. విప్లవగేయాలు
3. పెట్టుబడి విధానస్వరూపం
4. కమ్యూనిస్టు సంఘానికి సందేశం
5. ప్రపంచరాజకీయాలపై సోషలిస్టుదృక్పథం
6. ఎర్రజెండా
7. కార్మిక నియంతృత్వం
8. కార్మిక నియంతృత్వ చరిత్రాత్మకావసరము
9. సోవియటు మూలస్వరూపం
10. కార్మికోద్యమ వికాసము
11. చైనా
12. సామ్యవాదమే ఎందుకు?
13. జర్మనీ ఫ్యాసిజము
14. ప్రపంచ రాజకీయాలు
15. నాజీ జర్మనీ పై శాఖికప్రదర్శనము

